

శ్రీరస్తు.

# శ్రీవిఘ్నేశ్వరుని

## చవితి పద్యములు.

శ్రీశంభుతనయునకు। సిద్ధగణనాథునకు। వాసిగలదేవతావందితునకును। ఆసరసవిద్యలకు ఆదిగురువైనట్టి। భూసురోత్తమలోకపూజితునకు॥ జయమంగళం నిత్యశుభమంగళం॥

నేరేడుమారేడు నెలవంకమామిడిదూర్వాలు చెంగల్వయుత్తరేణి। వేరువేరుగదెచ్చి వేడ్కతో పూజింతు పర్వమున దేవగణపతికినిపుడు॥జయ॥

సుచిరముగభాద్రపద శుద్ధచవితియందు పొసగసజ్జనులచే పూజగొల్తు। శశిచూడరాకున్న చేకొంటినొకవ్రతము పర్వమున దేవగణ పతికినిపుడు॥జయ॥

పానకమువడపప్పు పనసమామిడిపండ్లు దాసిమ్మఫలమ్ము

రదాక్షపండ్లు! తేనెతో మాగిన తియ్యమామిడిపండ్లుమా
కుబుద్ధిచ్చుగణపతికినిపుడు ॥ జయ॥

చిన్న చెంబుతో పీళ్లు కొబ్బరికాయయుదకంబుఅల్లంబు బెల్లం
బుఅరటిపండ్లు! తేనెతో మాగిన తియ్యమామిడిపండ్లుపర్వ
మున దేవ గణపతికినిపుడు॥జయ॥

కోటలో నేపుట్టి కోటలో నే పెరిగి కోటమెక్కినవాడు కొ
మ్మనిగుల! ఆకాశబాణాలు భూచక్రగొడుగులు బాగా
యుపుద్దండవీరన్నకు॥జయ॥

మోదుగపువుండాళ్లుముద్దపప్పునెయ్యిఆదిగాగల తే
నెయమృతాన్నము! ఆహారతృప్తిగా తానారగించుచు
పర్వమున దేవ గణపతికినిపుడు॥జయ॥

బంగారుగడపలే కుందనపుతలుపు లే బంగారుస్తంబాల
పాలవల్లి! అంగనలు చెలరేగి హారతులుయిచ్చేరు బంగారు
యయ్యకు భ్రమరాంబకు॥ జయ॥

ఎలుకగుర్రము నెక్కి యెంత వేడుకతోను మలయుచు
నున్నట్టి మానగిరులు! తళుకుదంతము క్రింద తనబొజ్జకద
లంగ పలుకులో నేపలుకు వరమేశుకు॥జయ॥

ఓబొజ్జగణపయ్య నీబంటునేనయ్య వుండ్రాళ్ళమీదికి

దంతుబంపు ! కమ్మనినెయ్యియును కడుముద్దపప్పుయును బొజ్జవిరగ తినుచుపొరలుకొనుచు॥జయ॥

వెండిపళ్లెములోన వెయినూటలనుత్యాలు కొండలుగ గిలకులు క్కలయుబోసి। మోదుగనుఫలములు మెడనిండ వేసుకొని దండిగానికిత్తుధవళారతి॥జయ॥

పువ్వులనినుగొల్తు పుష్పాలనినుగొల్తు గంధాననినుగొల్తుకస్తూరిని। యెప్పుడునినుగొల్తునేకచిత్తంబున పర్వమున దేవగణపతికినిపుడు॥జయ॥

పార్వతీపుత్రునకు భవ్యచారిత్రునకు గీర్వాణపద్మదళనేత్రునకును గీర్వాణస్తోత్రునకుకీర్తిసంపన్నునకుపర్వమున దేవగణపతికిపుడు॥జయ॥

వన్నూరువరహాల నానుకుచ్చులుదండ మున్నూరువరహాలుముత్యములును। మెండుగరత్నాలు చెక్కినాకడియాలు భగ్నస్వరాలునూభ్రమరాంబకు॥జయ॥

శ్రీమూర్తివంద్యునకు చిన్మయానందునకు పామరస్తోత్రునకు శాశ్వతునకు। సోమార్కనేత్రునకు సుందరాకారునకు కామరూపికిని శ్రీగణనాథునకు॥జయ॥

ఏకదంతంబును ఎల్లగజవదనంబు వాకయినతొండం

బుబలుపుకడుపు। జోకయిన మూషకము పారిదినెక్కాడుచును భవ్యమున దేవగణపతికినిపుడు॥జయ॥

మంగళము మంగళముమార్తాండతేజునకు మంగళముసర్వజ్ఞవందితునకు। మంగళము ముల్లోక, మహితసంధాయనకు మంగళము దేవగణపతికినిపుడు॥ జయ॥

గిరికిమంగళగిరికి గిరినారసింహునకు పానకాలయ్యకును పరమేశునకు। అతివమంగళగిరిలో ...ందముగ నెలకొన్న అచ్యుతుడు శ్రీనారసింహునకును॥ జయ॥

బంగారుచెంబుతో గంగవుదకము తెచ్చిసంగిలిగశివునకు జలకమార్చి। మల్లెపువ్వులుదెచ్చి మురహారుపూజింతు రంగయిననాప్రాణ లింగమునకు॥ జయ॥

పట్టుచీరలుమంచి పాడిపంటలుగల్గి గట్టిగాకనకములు కరుబుహారాలు। యిష్టసంపదలిచ్చి యేలినస్వామికి పట్టభద్రునిదేవ గణపతికిని॥ జయ॥

పంచగయునినేడు ప్రియముతో నినునిల్పి కొంతుగాపూజలుమెప్పచేసి। దండిగావరములు దయచేసిమరియునాకుం డములు గోనుముయ్య దయతోడను॥ జయ॥

సిద్ధవిఘ్నేశ్వరా। ప్రసిద్ధిగాబూజించి యొనరంగనిరువది

ణముక్కవత్రి। దానిమ్మమరువము దర్భవిష్ణుకాంత వుమ్మె
త్తదూర్వాలువుత్తరేణి॥ జయ॥

కలువలుమారేడు గన్నేరు జిల్లేడు దేవకాంచనరేగుదే
వదారు। జాజిబలురక్కసి జమ్మివాసనపువ్వు గరికమాచిప
త్రిమొంచిమొలక। అగరుగంధమక్షిత ధూపదీపనై వేద్య
తాంబూలపుష్పోపహారములు-భాద్రపద శుద్ధచవితినిపగ
టివేళను, కుడుములను నానుబాలువుండ్రాళ్ళపప్పుపాయ
సముజున్న తేనెయు పంక్తివిరాళకొదిపూజింతు నిన్నుపుడు
కోర్కెలలర॥ జయ॥

మంగళంబనినిన్ను మహిలోనగొలచెడుఅంగజాముండ
రుల ఆత్మలోను పొంగుచుందువు దేవపూజలుగొనుటకై
భంగపెట్టకుమమ్ము భక్తుడనుచు॥ జయ॥

ముక్కంటితనయుడనిముదముతో నేనునుచక్కనైనా
వస్తుసమితిగూర్చి-సక్కముగ మనముననీయందునేనిల్పి నె
క్కవగుపూజలానింపుజేతు॥ జయ॥

రజతగిరినిలయునకు సుతుడవై జనిమించిగజవదనుడటం
చుఘనత జెంది- భుజియించుమాయింటభుక్తిశేషము లేక
భజనజేసెద నేను భక్తితోను॥ జయ॥

మల్లెలా మొల్లలా మంచిసంపెంగలాచల్లనైనా గంధ
సారములను- ఉల్లమలరగ మంచివుత్తమగుపూదలాకొల్ల
లుగ నేజేతు కోరివిఘ్నేశ్వరా॥ జయ॥

దేవాదిదేవునకు దేవతారాధ్యునకు దేవేంద్రవంద్యు
నకు దేవుకునకు, దేవతలుమిమ్ముగొల్చి తెలిసిపూజింతురు
భవ్యముగ దేవగణపతికినిపూజ॥ జయ॥

చెంగల్వచామంతి చెలరేగిగన్నేరు తామరతంగేడు
రుమగాను-పుష్పజాతులు తెచ్చిపూజింతునేనిపుడు బహు
బుద్ధిగణపతినిబాగుగాను॥ జయ॥

మారేడుమామిడి మాదీఫలంబులుఖర్జూరపనసలు
కదళికములు- నేరేడునారింజ టెంకాయతేనెయు చాల
గానిచ్చెదను చదువుతోనూ॥ జయ॥

సకలపూజలతోను సంభ్రమముగజేసెదను కర్పూరహార
తులు ఘనముగాను-పంచభక్ష్యాన్నములు పాయసంబు
సుమంచి నైవేద్యమునుజేతు నయముగాను॥ జయ॥

మరువకనుసువర్ణ మందారపుష్పము వెనుదుతాంబూ
ములనిత్తుగరుచుగాను- ఆహారప్రాప్తి వైభవముగనుష్మే
ఋపిగులిచ్చిరక్షించు శ్రీగణపతి॥జయ॥ సంపూర్ణము॥

శ్రీపార్వతీదేవి కోపంబునం జంద్రుశాపింపనాఁడాదియై చౌతిచంద్రు న్విలోకింపగా నోడి లోకంబులెల్లన్ భయాక్రాంతమైయుండగా నంత శ్రీకృష్ణదేవుండు గోక్షీరపాత్రాంతరంబందు గాన్పించు తచ్చంద్రబింబంబు గాంక్షించునా కొక్క బల్నింద సంప్రాప్తమౌనంచు శంకించి గానిమ్ము నాచేతనీనింద నీశాపముల్ దీరునంచున్ బదార్వేల వాల్గంటులం గూడి యిష్టోపభోగంబులం బొందుచుండంగ నా సూర్యు నర్చించి తాఁదెచ్చియున్నట్టి సద్దివ్యరత్నంబు నా సత్యభామాపితృల్ శౌరి గోరంగ దాని వ్వక సద్దమ్ము కంఠంబునం జేర్పగా దాల్చి దా వేటకై బోవగా కాననంబందు వర్షంబు చేడస్సియున్నట్టి భూజాని బట్టి సింగంబు దున్మాడి తద్రత్నముల్ గంఠభాగంబునం దాల్చి దేదీప్యమానంబునం బోవుచున్నంతటన్ సత్యవంతుండు భల్లూకనాథుండు తత్సింహముం జూచి మాణిక్యముల్వ్వాంచు గోరంగ గదుం భ్రాంతి చేని వ్వగా లేని పంచాస్యముం జంపి తేజోమయంబైన రత్నంబు తత్పుత్రికాడోలికాగ్రంబునం గట్టియున్నంత దమ్ముండు తత్కాననాంతంబునం జచ్చుటాలించి భూమీశుఁడా రత్నముం గోరి శ్రీకృష్ణుఁడీఘోరవంబుం జేసెనంచున్ వచింపంగ నారా

యణుండల్ల శుభ్రాంశుమాహాత్మ్య మంచాత్మనూహిం
చి వేగంబ దానేగి యశ్మాకాననంబందు బంచత్వముంగన్న
భూజానినింసింగముంగాంచి యాజాడ బోవన్ గుహామధ్య
భాగంబునన్ వెల్గుమాణిక్యముంజూచి వేబుచ్చి గొన్నన్ము
రారాతి నాజాంబవంతుండు వీక్షించి ముయ్యేడు వారంబు
లంబోరి దానోడ్చి యాతండు వైకుంఠుడంచున్ నుతుల్ జేసి
తత్పుత్రికారత్నమున్ రత్నమున్ దెచ్చి యర్పింపగా నొందు
డానందముం జెంది తద్రత్నమున్ రాజుచే నిచ్చి వృత్తాంత
మెల్లన్ వినంబల్కగా భూమికాంతుండు బల్ భీతిచే సత్య
భామన్ సమర్పించి యారత్నమర్పింపగా నొల్లకన్ వారి
జాక్షుండు వారిర్వురం బెండ్లియై వేడ్కగ్రీడింపుచున్ నాడు
చారిత్ర మెవ్వండు విన్నన్ సుధాంశున్ విలోకింప సంప్రా
ప్తమౌ నిందలం బాతురం జానలిచ్చెన్ దయాసింధుసద్దేవు
వాక్యంబుచే లోకమెల్లన్ మహామోదమున్ జెంది నిర్భీత
మయ్యెన్ భవద్దివ్యచారిత్ర మేనిట్లు బూదండగా గూర్చి య
ర్పించితింగాన సంతోషచిత్తంబునం దీని గైకొంచు నీ సత్కృ
పాదృష్టి వీక్షించు మన్నన్ నమో విఘ్నరాజా నమో భాను
తేజా నమో భక్తమందార భూజా నమస్తే నమస్తే నమః॥ శ్రీ

